శ్రీ

# భారతాంబికా శతకము

---

గ్రంథకర్త

గరికపాటి మల్లా[illegible]ని



శ్రీ గాంధి ఆంధ్రజాతీయ మహావిద్యాలయము పండితుఁడు

ఏలూరు.



పట్టాభిరామ ముద్రాక్షరశాల, ఏలూరు

1931



[వెల [illegible]

ఓమ్.

దేశభక్తులును, భాషాభిమానులు నగు
సోదర దేశీయులకు నాదొక

# విజ్ఞప్తి.

ఆర్యులారా! భగవదనుగ్రహంబున మహాత్ముని యాజ్ఞానుసారంబుగ నాచేసిన యల్పసేవకు ప్రభుత్వమువారు బహూకరించిన వత్సరావధికమగు విశ్రాంతి ననుభవించు సందర్భమున బళ్లారి యల్లిపురము కాంపుజయిలున వసించు భాగ్యము చేకూరినది. అత్తటి మహాత్మునిచేఁ బ్రసాదింపఁబడి దేశీయులచే నామోదింపఁబడి దేశభక్తులచే నారాధింపఁబడి, ప్రపంచమంతటిచే గౌరవింపఁబడి ప్రభుత్వము నొక విధమగు సామ్యభావమునఁ దనవంకకు మరల్చుకొన్న కడచిన మహోద్యమముంగూర్చి యేదైన నొక చిన్నపొత్తమును బద్యరూపమున వ్రాయవలెనని జనించిన నాకుతూహలమునకు ఫలితమే యీశతకము.

ఇది రాజకీయ గ్రంధమగుటచే నొకించుక వ్యాకరణాతిరిక్తములగు ప్రయోగములకుఁ దావొసంగిన నా సాహసము క్షంతవ్యము.

దీనిని ముద్రించు సందర్భమున నాకు యథావిధిఁ దోడ్పడిన పశ్చిమ గోదావరీ మండలము కాంగ్రెసు కార్యదర్శిగారగు శ్రీ శ్రీ బందా వియ్యన్న పంతులుగారికిని తన్మూలమున గాంగ్రెసువారికిని నాకృతజ్ఞతాభినందనములు.

ఇట్లు,
గ్రంథకర్త.



ఓమ్.

# భారతాంబికా శతకము.



ఉ. శ్రీమదనంత సంపదధరీకృతదైవతధామ ! వారిధి
గ్రామహిమావనీధ్ర పరికల్పితసీమ ! సతీత్వసత్వవా
చామహితాత్తనామ శ్రుతిసమ్మతధర్మగణైకధామ ప్రో
ద్దామగుణాభిరామ! విగతప్రకటోపమ! భారతాంబికా!

ఉ. కొందఱువిష్ణుఁడందు రిలఁగొందఱు శంకరుఁడందు రంకనుం
గొందఱుక్రీస్తువండ్రు మఱికొందఱుచూడ మహమ్మదందురీ
గందరగోళమందు దెసఁగానక తొట్రిలనేలనమ్మ! ని
న్నందఱమాఱుగాఁ గొలువనబ్బదె మోక్షము? భార
[తాంబికా!

చం. హరిహర ముఖ్యదైవతములందఱకుం బ్రతినిధ్యముం
బొరసినశక్తిరూపిణివి భూతమయాత్మవు నిన్నుఁగొల్వనం
దఱభజియించినట్లగును దత్ఫలముల్ సకలంబు మాకుఁ జే
కుఱునని యెంచి నీభజనకుందొరకొంటిని భారతాంబికా!

ఉ. ఎన్నటికైన నీభజనయే తిరమంచు మదిందలంచి యె
న్నన్నిదొనంగు లేఁచిన సహించి దిటంబువహించి నమ్మినీ
బన్నముదీర్పఁబూనని యపాత్రపుజీవనమేల? తల్లి ! నీ
కన్నఋణంబుఁ దీర్చుకొనఁగావలదా భువి? భారతాంబికా.

ఉ. పుట్టిన నీదుబిడ్డలము పొట్టకుబట్టకులేక పెక్కులి
క్కట్టులు పొందుచుండ నధికారులమంచు విదేశసంభవుల్
నెట్టనఁ బీటవెట్టుకొని నీసిరినల్లను దోచుచుండ మే
మెట్టుల నింకఁజూచి సహియింపఁగలారము భారతాంబికా.

ఉ. వంచనవృత్తి దేశము నవారణలోఁగొని స్వార్థబుద్ధిఁ బా
లించు నెపంబునన్ సిరిహరించుచుఁ గిమ్మనసీని దాష్ట్యమున్
వంచుటొ త్రుంచుటో యిపుడవశ్యము నాచరణీయమంచు నూ
హించి మహాత్ముఁడీగతి వహించెను భారము భారతాంబికా.

ఉ. ఎన్నివిధాల యత్నమొనరించిన లాభములేక, క్రూరమై
యున్న నిరంకుశప్రభుత నూడ్చఁగ నాకరుయత్నమంచుఁ దాఁ
గ్రొన్నన గాంధిశాసనతిరస్కరణంబును నుప్పపన్నుపైఁ
బన్నను లోకులెల్ల వహవాయని మెచ్చఁగ భారతాంబికా.

చ. ఉడుగనుమధ్యలో ఫలితమొందక వెండియునాశ్రమంబునం
దడుగిడ, నియ్యెడన్ విజయమందుటొ నాశవమంబురాశిపై
నడపక తేలుటో జరుగు నింతయు సత్యమటంచు ధీరుఁడై
కడఁగెఁ బ్రభుత్వధిక్కృతికి గాంధిమహాత్ముఁడు భారతాంబికా.

ఉ. రండిదెయిప్పచట్టము తిరస్కృతిసేయుఁడటంచు జైత్రపున్
డిండిమఘోషణంబెనఁగ డెబ్బదియేడ్వర దండుతోఁడ ను
ద్దండత దండికేఁగి రిపుతండములొత్తిలి చూచుచుండ బ్రి
హ్మాండముగాఁదిరస్కృతిమహాత్ముఁడొనర్చెనుభారతాంబికా.

ఉ. పాయని వేడ్కమైనవుడు పశ్చిమగౌతమి మండలంబునన్
జేయని మేలురందుటుముఁ జేర్చిరి నీప్రజ, లంతఁ దచ్చమూ
నాయక పట్టభద్రునిఁ బొనర్చిరి మేరుగభీరు, దండు నా
రాయణరాజశేఖరు నరాతిభయంకరు భారతాంబికా!

ఉ. అందముగాఁగ మోమున జయావహకుంకుమరేఖదీర్చియుం
దందుఁబురాంగనామణులు హారతులీయఁగ నాత్మకూరిగో
విందసుధీవరుండు తనవెంబడి బాసటనిల్వ సేనకున్
ముందుగసాగె రాజకులభూషణుఁడమ్మయి భారతాంబికా.

చ. వెడలెభవచ్చమూతతులు వీర్యపరాక్రమధైర్యశౌంతముల్
ముడివడ దేవదుందుభులుమ్రోగ విరోధికదంబకంబు త
ల్లడపడిడిల్లవోవ, జటులక్రియ మాటికి నూత్నయోధుల
ల్లడపకరానుగాదితతినేప్రియలాదిని భారతాంబికా.

ఉ. మామకశిష్యతల్లజుఁడుమంజులగాత్రుడు దొడ్డయాఖ్యుడున్
మామకసోదరుండు ధృతిమంతుఁడు జోగయశర్మగూడి ర
మ్యామలభావముల్ దొలక హాయిగఁబాడెదు స్వైరగీతికా
స్తోమముభీరుతందొలఁచి శూరతఁగూర్చెను భారతాంబికా.

ఉ. భారతదేశసంభవుఁడ భారతదేశము నాది భారత
స్వైరతకేనుదీక్షఁగొని సాగుచునుంటిని, ప్రాణమూడినన్
జారఁగనీనుమానమని చాటెడుపాటను యోధవర్గముల్
సారెకుఁబాడ స్థాణువులుసైతముఁ జేయునె భారతాంబికా.

ఉ. ఈగతి సేన భీమవరమేగెడునప్పుడు మార్గమం
దాగిన యెల్లయూళుల మహత్తర సత్కృతిఁజేసి యెల్లరున్
జాగముఁజూపి యుద్యమముసాగుట కర్థమొసంగినార, లీ
రాగమె తెల్పదే ప్రజస్వరాజ్యపుఁ గాంక్షను భారతాంబికా.

ఉ. రాచకొలంబునీతిఁ బ్రచురంబొనరించుచు శాంతియుద్ధమం
దాచకవృద్ధులుంబుడుతలైనను బూనికమాతృదాస్యమున్
మోచనమాచరింపఁగ సమూహములై పరతెంచిరద్దిరా!
దాచినడాగునే సహజధర్మములెందును భారతాంబికా.

ఉ. ఇమ్మెయి దండు భీమవరమేగెడునంతకు నాలుగంతలై
క్రమ్మఁగ నాఁటి యుత్సవపరంపరలన్వినుతింపశక్యమే?
హుమ్మని యోధులడ్డాకరినొక్కరు మించుచుఁదీవ్రతఁబ్రబో
ధమ్మొనరించిరయ్యెడరు దర్శనపాత్రము భారతాంబికా.

ఉ. దండును రెండుఁజేసి పెఱదారుల గ్రామములెల్లఁజుట్టి పం
డ్రెండవతేది రేపన వడింజనుదెంచిరి మట్లపాలె, మా
రెండవనాఁడె యుప్పునొనరించి తిరస్కృతిఁజేసినారలు
ద్దండులుగాఁగ తావక సుతప్రకరమ్ములు భారతాంబికా. 17

ఉ. స్నాతసమస్తసాధుజనసంచయ పాపవినాశకృద్వసి
ష్ఠాతటినీతటాంతరలసన్మహితాశ్రమనిర్మితంబులౌ
నాతతశాలలన్విడిసిరయ్యెడ యోధగణమ్ము, శత్రుసం
ఘాతములబ్బురంబును వగంబడిచూడఁగ భారతాంబికా.

ఉ. పండినయుప్పు కొల్లలుగ బట్టలపైఁబడి దిర్సుమట్టునం
దుండ బిరాన రాజమణియున్మతికొందఱునేగి తెచ్చుచో
దుండగులైన రాజభటధూర్తులు నీచతగాసిసేయ ను
ద్దండులెయయ్యు శాంతమును దాల్చిసహించిరి భారతాంబికా.

ఉ. ఏప్రిలులందు దేశమున నెల్లెడ వోలెన మట్టుపాలెమం
దప్రియ శాసనంబు హతమార్పఁగనుప్పొనరించుచుండ దీ
ర్ఘప్రజవోలె తండములు తండములై జనులేగుదెంచి యా
శ్చర్యప్రతిమానదృశ్యమున కచ్చెరువందిరి భారతాంబికా.

చం. ఇటుపయిఁదూర్పుతాళ్లకడ పెచ్చుగనుప్పొనరింపవచ్చునం
చటకొకకొందరేగుసమయంబునఁ గ్రూరతనాయకద్వయిం
జటుకునఁబట్టి శిక్షనిడి జైలునకంపెఁ బ్రభుత్వ మంతన
చ్చటఁగలపెద్దలెల్లరు వెసన్ సభగూడిరి భారతాంబికా!

ఉ. అమ్మెయిఁగూడినట్టిసభయం దనఘాత్మునిఁ గొమ్మరెడ్డివం
శమ్మునకుంబ్రదీపకుని సాధుచరిత్రకు నాంజనేయ నా
మమ్మునఁబొల్చు కమ్మకులమండను నాయకుఁజేసిరంతసై
న్యమ్ములుతూర్పుతాళ్లకుఁబ్రయాణమొనర్చెనుభారతాంబికా.

ఉ. వేసలు తూర్పుతాళ్లకడఁ జేరిన వెన్కను సర్వతోటలో
స్థానము నేర్పఱించుకొని, తద్దయు వేడుక మళ్లుగట్టి పె
న్స్థానిక సుప్పుఁ జేసి, కొనిపోయి పురంబుల నంతలన్ జన
స్థానములందు నమ్మిరిగదా! కడుధీరత భారతాంబికా.

ఉ. చేసితిముప్పు తప్పులుగ జేసినమమ్ములఁ బల్కరింపకే
దోసెడు నీరు తెచ్చుకొని దొప్పలను ప్పొనరించు నారులన్
మీసలురాని బాలురను మిక్కిలిగా సిలజేసె సర్వపూ
ర్వాసి కలెక్టరీ పిటికి వార్తను వింటివె భారతాంబికా.

ఉ. అంతకుమున్నె భీమవరమావలఁ గొందఱు దిగ్సమత్తులో
నెంతయు వేడ్కనుప్పు నొనరింపఁగ బోవఁ గలెక్టరాగ్రహా
ష్వాంతముతోడఁ జెర్వునకొసంగము నీరని మాటిమాటికిన్
వింతగ గ్రామవాసులకు భీతినిఁ గొల్పెను భారతాంబికా.

ఉ. ఆమెడ గ్రామవాసుల భయంబెడలించుచుఁ జెర్వులోనికిన్
దోతుములార నింపి పరితోషము గూర్చెను దంతులూరినా
రాయణరాజు శాత్రవభయంకరు డర్ధిజనాశ్రయుండు దు
ర్జేయపరాక్రమక్రముఁ డనిందితధైర్యుఁడు భారతాంబికా.

ఇ

చం. మొలకువనుప్పుఁ జేసికొని మే నెలమండలమందుఁ గల్లుపా
కలకడ సీమబట్టలకు కాణములుండెడు నావణస్థలం
బులకడ శాంతవృత్తిని బ్రబోధ మొనర్చుచునుండఁ బాలకుల్
కలఁగి జయిళ్లఁ బెట్టి రధికారము పెంపున భారతాంబికా.

ఉ. ఎంతగబందెలందిడిన నేడ్తిరవచ్చెడు యోధవర్గమున్
బంతముఁజూచి వీరికిఁక బందెలుచాలవటన్న భీతి దు
శ్చింతయొనర్చి పాలకులు చిందరవందరగొట్టసాగినా
రింతులు బాలురంచయిన నెంచక యెల్లర భారతాంబికా.

ఉ. ఆ నెలఁగూడెమందుఁ బదునారవ తేదిన రేష్ఠఁజేసి సా
మానులబండి నేలురికి మాపటి వేళను దెచ్చిరక్ హొటల్
బోనమొసంగి సబ్జయిలుముద్రను నిద్దురబుచ్చి ప్రొద్దుటన్
స్నానము వెన్కఁబిల్చిరి విచారణసేయఁగ భారతాంబికా.

ఉ. లేదుగదయ్యె మానుడుల లేశమసత్యము సత్యబద్ధమా
వాదమె దోసమయ్యెడు నభాగ్యుడదేమనక య్యెనింక నేఁ
గాదననేల మీవిహిత కార్యకలాపము దీర్పఁబూను డా
మీదట దేవుడేకలడు మిమ్ములమమ్ము పరీక్ష సేయనం
చేదిటమూని కోర్టున వచించితి నప్పటి భారతాంబికా.

ఉ. ధీరుడు బాపినీడు గడితేరిన శూరుడు విద్యనార్యమక్
వీరుడు పూరుషోత్తముఁడు విశ్వసధీమణి రామచంద్రరా
వారయరామకృష్ణ విబుధాగ్రణి జోగయశర్మకన్నయా
ఖ్యోరుబలుండుమున్నగలయోధులుగూడిరి భారతాంబికా.

ఉ. మాయిఱెశౌర్యధైర్యవిభవప్రథితాత్ముడు, దంతులూరి నా
రాయణ రాజచంద్రుడును, త్యాగధనుండగుముప్పిలక్ష్మి నా
రాయణ కొమ్మరెడ్డి సుకులాభరణాంబన నొప్పు సత్య నా
రాయణ పైడిపాటి కులరత్నము వేంకట పూర్వశోభి నా
రాయణ సూరిశాస్త్రి ముఖులర్చనజేసిరి భారతాంబికా.

ఉ. అద్రి సమానధీరుడును నాశ్రమనాథుడు సుబ్బరాజు నీ
లాద్రి వదాన్యశేఖరుడు హాస్యవచోనిధి సుబ్బరాజు ని
ర్ణిద్రయశుండు జగ్గనమనీషి బుధుండు ప్రకాశరాయుడున్
మాద్రికిమించి నీపద సమర్చన జేసిరి భారతాంబికా.

చ. అలఘుఁడు రంగశాయి సుగుణాఢ్యుఁడు ధీరుఁడు కృష్ణమూర్తిని
శ్చలుడగు గంగరాజు, సతిసాహసుఁడౌ నలవీరభద్రరా,
వెలమిని రామమూర్తి, ఘనుఁడీశనివారవు సుబ్బరావునుం
బొలుపుగ నీపదాబ్జములఁ బూజలొనర్చిరి భారతాంబికా.

చ. చెలు వెసగన్మదుంబ నరసింహమనీషి నృసింహ శర్మయున్
ములుపురి రంగయాఖ్యుడు బ్రబుద్ధుడు కొవ్వలిగోపమంత్రిని
శ్చలపటుధైర్యుడౌ పసలసత్కులచంద్రుడు కృష్ణమూర్తియుం
జెలువలతోడ నిన్గొలిచి శిక్షల బొందిరి భారతాంబికా.

ఉ. చిక్కని మేనులన్ మదికి జిక్కసియూహల బాలుగారు నుం
జెక్కుల గుల్కులేనయిను జిన్నికుమారకు లెందరేని పె
న్మక్కువ నీదుసేవకు ఘనంబగు శిక్షల గొన్నవారల
మ్మక్కత్వదీయభావిశుభమక్షులదోచెను భారతాంబికా.

చ. పురుషులమాట కేమి పువుబోడులు సైతము నమ్మవారిజా
తరయునిపోలు నుద్యమరథంబునులాగుట కగ్రయానలై
చెరలకునేగి క్రూరతరశిక్షలకుం గురియై మహాత్మునా
దరమునుమన్ననల్ గొనిరి తల్లిభవత్కృపభారతాంబికా.

ఉ. ఎందఱో శర్మలున్ మఱియు నెందఱో వర్మలు గుప్తలెందఱో
నెందఱో చౌదరుల్ మరియు నెందఱో కాపులు రెడ్డులెందఱో
పొందుగ మాతృదేవతకు పూజలొనర్పగ జేరినట్టి యా
యందము చూడ దావక మహత్వవిశేషము భారతాంబికా.

ఉ. చేరిన యోధవర్గమున జిన్నల బెద్దల నెల్లవారి జే
ర్చేరవచింపనేరక యుపేక్షవహించితి గాక పోరివి
స్తారపరాక్రమక్రియలం దసక్తతాధికమున్నవారలా
ధీరులు త్యాగశీలుర నుతించెద మాటికి భారతాంబికా.

చ. ఇదివరకెన్నడున్ జెయిలు కేగక పోవుట రాజమండ్రిలో
మొదటను సంజబంచెకడ ముందటి ద్వారము సొచ్చినంతనే
యది యమలోకవుం దెరువటంచు మదిం దలపోసికొంటి న
ప్పుదయము దాక నుంటి బెదురూడెను పిమ్మట భారతాంబికా.

ఉ. అమ్మలకమ్మవంచు ననయమ్మెద నమ్మినవాడనౌట మా
యమ్మను నయ్యనాత్మజుని నాలిని నిర్వుర తమ్ముగుఱ్ఱలన్
నమ్మిన యాడుతోడుల మనమ్మున నెంచక సోదరత్రయం
బిమ్ములవెంటరా జయిలుకిమ్మెయి వచ్చితి భారతాంబికా.

ఉ. అన్నిటికేని దిక్కనుచు నాత్మలనమ్మిన దల్లిదండ్రులున్
జిన్నిసుతుం డమాయికవు చేడియ తమ్ములు నాడుతోడులే
తెన్నున నున్నవారని మదిందలపెట్టను నీవు లేవొకో
పన్నగవారలన్ననుప భాగ్యవిశోభిత భారతాంబికా.

ఉ. తల్లినిమించుతల్లి పెదతల్లికుమారుడు సోదరుండు నా
నుల్లమెరింగి నాయెడల నున్నతిజూపు నుదారభావసం
పల్లవితుండు ధైర్యమొకపాటిగ మాచెలమయ్యశాస్త్రి నా
కుల్లమునందు బెంచుటమహాత్మ్యవమయ్యెను భారతాంబికా

ఉ. హృద్యములైన వంటకము లిచ్చుటవచ్చునె నీకుసర్వమా
వేద్యముకాదె యీపులుసు వేసిన యుప్పుకుముద్ద నాకిటన్
ఖాద్యముగాపునన్నిరభిఘాగమపాత్రముసైన నీకు నై
వేద్యమొసంగుచుంటి గొనవే నిరసింపక భారతాంబికా.

ఉ. పైనిగలంతకెవ్వరెటు భావనఁజేసినఁ గూడబోనముం
బానముసేయులేదితరపంక్తిని నేడిట్కఁ దప్పదయ్యెనా
మానముప్రాణమున్నియు సమర్పణఁజేసితినీకుగాన నే
మేనొనరింతు నీకొఱకునిల్చుకజంకకు భారతాంబికా.

చ. తెలిపితివాదివేద సమధిష్టితవాక్యల పన్మతం బచం
చల మతిపూత మార్యజనసమ్మతమౌ దెవడెట్టిధర్మమున్
జలువుటయుక్తమో మిగులఁజక్కగఁజూపితివమ్మ దానికి
దొలగినవారు దుర్గతుల దోగుదురంటివి భారతాంబికా.

చ. మతము పరేశుఁజేర్చు నొకమార్గము, తద్విహితప్రబంధన
ప్రతతి దొరంగువారల కపాత్రతగల్గు కుటింగియున్ స్వత
త్రత విటు కోలుపోయినకతంబున జీవము నిల్పుకొంటకై
గతిచెడి యిట్టి కూడు దినగాఁవలెనెన్నెను భారతాంబికా

చ. మతమునుగొల్చి దేశమెటుమాడినజూచుచునుండ్రుకొందరా
మతమునుఁదూరి దేశమునుమాత్రమెకొల్తురుకొందరేన్ స్వతం
త్రతగల యంతవట్టు నిరుధర్మములంబొనరించుచుంట సాం
ప్రతమని నమ్మినాడ నడబాయను రెంటిని భారతాంబికా!

చ. తమ కులధర్మముల్విడక తత్పరతంబొనరించువార, లు
త్తమగతిఁబొందఁగాఁగలరు తప్పకటంచలశాస్త్రముల్ ప్రబో
ధమునొనరించుచుండఁ బెరదారులుత్రొక్కి పరస్పరంబుక్రో
ధములనుబెంచుకొందురుగదా కలిమాయనుభారతాంబికా.

ఉ. తగుమవు దీనికీవనుచుఁ దక్షతనీవిడినట్టి కత్యలోఁ
బొగరునఁదప్పినమ్మగుడఁబొందును దానిన లేక క్రిందికిన్
దిగఁబడునంచుఁజెప్పిన విధిందలపోయక క్రిందుమీదులై
తెగఁబడియున్న నీసుతులదిద్దుట యుక్తము భారతాంబికా.

ఉ. క్లాసులటంచు నేడొకవికారముపుట్టె ప్రభుత్వమందు నీ
క్లాసులొసంగువార లధికారవిమత్తులెకాని, న్యాయ వి
జ్ఞానములేనివారటు లనంజనదన్నను బిడ్డకట్లు బీ
క్లాసిడి సేనితండ్రికిటు గట్టఁగవచ్చునె భారతాంబికా.!

ఉ. వంచనబుద్ధినిందనుక భారతదేశము చీలదీసి పా
లించినవారలాట నిపుడీగతి క్లాసుల సృష్టిజేసి యొ
క్కించుక నోరుగల్గి తలలెత్తెడువారల వేఱుసేసి శే
షించిన వారిసీలనుచుఁ జిక్కులఁబెట్టిరి భారతాంబికా !

ఉ. తల్లినిమించుతల్లి పెదతల్లికుమారుడు సోదరుండు నా
నుల్లమెరింగి నాయెడల నున్నతిజూపు నుదారభావసం
పల్లవితుండు ధైర్యమొకపాటిగ మాచెలమయ్యశాస్త్రి నా
కుల్లమునందు బెంచుటమహోత్సవమయ్యెను భారతాంబికా.

ఉ. హృద్యములైన వంటకము లిచ్చుటవచ్చునె నీకుసర్వమా
వేద్యముకాదె యీపులుసువేసిన యుప్పుకుముద్ద నాకిటన్
ఖాద్యముగావునన్నిరభిఘాగమపాత్రమునైన నీకు నై
వేద్యమొసంగుచుంటి గొనవే నిరసింపక భారతాంబికా.

ఉ. పైనిగలంతకెవ్వరెటు భావనఁజేసినఁ గూడబోనముం
బానముసేయలేదితరపంక్తిని నేడిఁకఁ దప్పదయ్యెనా
మానముప్రాణమున్నియు సమర్పణఁజేసితినీకుఁగాన నే
మేనొనరింతు నీకొఱకునించుకజంకకు భారతాంబికా.

చ. తెలిపితివాని వేద సమధిష్ఠితవాక్కుల సన్మతం బచం
చల మతిపూత మార్యజనసమ్మతమౌ దెవడెట్టిధర్మమున్
జలువుటముక్తమో మిగులఁజక్కఁగఁజూపితివమ్మ దానికిం
దొలగినవారు దుర్గతుల దోగుదురంటివి భారతాంబికా.

చ. మతము పరేశుఁజేర్చు నొకమార్గము, తద్విహితప్రబంధసం
ప్రతతి దొరంగువారల కపాత్రతగల్గు నెఱింగియున్ స్వతం
త్రత నిటు కోలుపోయినకతంబున జీవము నిల్పుకొంటకై
గతిచెడి యిట్టి కూడు దినగాఁవలసెన్నెను భారతాంబికా!

చ. మతమునుగొల్చి దేశమెటుమాడినజూచుచునుం డ్రుకొందరా
మతమునుదూరి దేశమునుమాత్రమెకొల్తురుకొందరేన్ స్వతం
త్రతగల యంతవట్టు నిరుధర్మములంబొనరించుచుంట సాం
ప్రతమని నమ్మినాడ నెడబాయను రెంటిని భారతాంబికా!

చ. తమ కులధర్మముల్విడక తత్పరతంబొనరించువార, లు
త్తమగతిఁబొందఁగాఁగలరు తప్పక టంచలశాస్త్రముల్ ప్రబో
ధమునొనరించుచుండఁ బెరదారులఁద్రొక్కి పరస్పరంబుక్రో
ధములను బెంచుకొందురుగదా కలిమాయనుభారతాంబికా.

చ. తగునువు దీనికీవనుచుఁ దక్షతనీవిడినట్టి కత్త్యలోఁ
బొగరునఁదప్పినన్మగుడఁబొంమను దానిన లేక క్రిందికిన్
దిగఁబకునంచుఁజెప్పిన విధిందలపోయక క్రిందుమీదులై
తెగఁబడియున్న నీసుతులదిద్దుట యుక్తము భారతాంబికా.

ఉ. క్లాసులటంచు నేడొకవికారముపుట్టె బ్రభుత్వమందు నీ
క్లాసులొనంగువార లధికారవిమత్తులెకాని, న్యాయ వి
జ్ఞానములేనివారటు లనంజనదన్నను బిడ్డకట్లు బీ
క్లాసిడి నేనితంట్రికిటు గట్టఁగవచ్చునె భారతాంబికా.!

ఉ. వంచనబుద్ధినిందనుక భారతదేశము చీలదీసి పా
లించినవారలాట నిపుడీగతి క్లాసుల సృష్టిజేసి యొ
క్కించుక నోరుగల్గి తలలెత్తెడువారల వేఱుసేసి శే
షించిన వారిసీలనుచుఁ జిక్కులఁ బెట్టిరి భారతాంబికా!

ఉ. లెక్కకుఁ బ్రొద్దుటన్ ఫయిలు, లేచిన వెన్కను గంజి ఫైలు, ప్రొ
ద్దెక్కిన పీచు ఫైలు, మఱియించుక తాళిన ముద్ద ఫైలు, నీ
చక్కని ఫైళ్ళలోఁ గొఱతసల్పు ఫెబుర్లను రాజమండ్రి జై
లక్కటకక్కసంపు నరకాలయమాఁగద భారతాంబికా.

ఉ. ఉప్పుడుబియ్యమన్నమున నొద్దికఁ గొట్టిన ముద్దముద్దతోఁ
గుప్పననాసికంబగులఁ గొట్టు నసహ్యాపుఁగంపు దిక్కులం
గప్పుచు నుప్పుకారములు గానవి చప్పనిపుల్సు నాకళుల్
దప్పినవేళఁ బెట్టుదురు, తల్లి! వినంగదె భారతాంబికా.

చ. గలిజెరుకాడ దొగ్గలియు గడ్డియుగాదము వైచి రాళ్ళు మే
కులుగలకంపుపుల్సు నొకకొంచెముపోయుదురమ్మ! దేవతా
పులుసట దానిపేరహహ! మోక్షపుపుల్సనరాదె? చావుపు
ట్టులుగనరద్ది గ్రుక్కెడు గుటుక్కునఁద్రావిన భారతాంబికా.

చ. అనయము జైలు పెద్దల దురాచరణంబులెకాక వింతదో
చెనువిను పొట్టచింపి పరిశీలనఁ జేసిన నొక్కయక్కరం
బును గనుపింపనట్టి పెనుమూఢులు వార్డరుగాంగ్సుకూడ మ
మ్మును బెదిరించుచుండఁ దలమోడుపవచ్చెను భారతాంబికా.

చ. త్రిచిఁగలవైద్యుఁడామెహాత దేవసమానుఁడు వాఁడమ్మ మ
మ్ముచితవిధోపచారములనొప్పఁగఁ జూచుచు మగారవించినాఁ
డచటిప్రధానపాలకుడు నచ్చటిజైలరు చిన్నజైలరున్
సుచరితులై మముంగరుణఁజూచెడువారలు భారతాంబికా.

ఉ. ఒక్కయెడంబురాణములు నొక్కెడసత్కవితావిలాసమిం
కొక్కెడఁగావ్యపాఠములునొక్కెడహాస్యములాటపాటలిం
కొక్కెడనుప్పుబద్దెలు మఱొక్కెడబల్ చెఱుగుల్లునొప్పఁగా
నిక్కరణింద్రిచింజరిగె నెంతయు హాయిగ భారతాంబికా.

ఉ. వాసిగనొక్కకాంత్రు మెయివచ్చినమ్మ్రోడఁజేసి యే,బి, సీ
క్లాసులనంగ నేర్పఱచి కష్టతరమ్ముగ మమ్ముబోంట్ల సీ
క్లాసునద్రోచి యుల్లిపురికారకురాష్ట్రమునందుఁ గల్గు సీ
క్లాసును దెచ్చిరీజయిలుకాపరి గ్రీనట భారతాంబికా.

ఉ. నీపరిచర్యకై కడగి నేమొదలేగద నేనునేనటం
చాపగిదిన్ముకుందజననాలయముల్వడినింపవచ్చి నే
డీవులుసన్నముంగొనుట కేఁగిరికై శునకంబులట్లు తా
మోపికలూడికొట్టుకొనుచుండ్రిసుతుల్ గనుభారతాంబికా.

ఉ. మానుగనెల్లరుం గడు సమర్థులు మాన్యులు నీసుభక్తులున్
జ్ఞానులు, బుద్ధిమంతులు ఘనంబగు నీతికి బద్ధులైన వా
రైనను నేడిదేమి? కలహంబులఁ గుందుచునున్న వారహా
దీనికి మూలకారణము దెల్పెద విన్ముక భారతాంబికా!

ఉ. వేళకురాదుబోన, మొకవేళను వచ్చినఁ గూడఁ జాలిము
జాలదు, చాలెనేనియును జక్కఁగఁ బక్వముఁగాదు, పక్వమై
గ్రాలిన నుప్పుకారములు గానఁగరా, వొకయింతయుండినన్
రాళ్లిసుముండిదంతములురాల్చుచునుండును భారతాంబికా

ఉ. లిప్తయు శాంతిసౌఖ్యములు లేశముపొందఁగరానియట్లు సం
క్లిప్తపుమేరఁ బెక్కురఁ గడిందిగఁగూరినచో, నకాలసం
ప్రాప్త,మపాత్రభోజ్యమునవశ్య,మరుచ్య,మశుభ్రము, న్నప
వ్యాప్తమునైన బోనమిడనల్లరిపుట్టదె? భారతాంబికా.

ఉ. అమ్మ! త్రిచిన్ జనించెఁ దమిళాంధ్రులయందు రవంతభేదభా
వమ్మది యుల్లెపూరున వివర్ధితమై తుదిభిన్నపాత్రి సా
కమ్మును భిన్నవాసమును గల్పనజేసిన దావిధమ్మె సా
జమ్మనిపించె నెమ్మది నిజమ్ముగ నమ్ముమ భారతాంబికా.

ఉ. చీటికి మాటికిందగవు సేతలు కూతలు బూతులాటలా
ర్భాటపు మాటలన్నియు నిబద్ధములయ్యెను మూర్ఖచేత బా
హాటముగాగ వేర్పడిన యన్నయు దమ్ముడు వోలెనుంటి మ
నుటఁ బరస్పరాదరము నమ్మకముంగని భారతాంబికా.

ఉ. గొప్పగు బొజ్జతోడ నడగొండ విధంబున వచ్చి బెత్తమున్
ద్రిప్పుచు నిప్పుఁదొక్కిన గతిన్నిలుపోపక ఫైలునందుమా
చెప్పెడి దానిసుంత చెవిఁజేర్పక మాటికి నాస్తిశబ్దముం
జెప్పెడి గ్రీనవుద్దు తొలిచేతలు వింటివె? భారతాంబికా.

ఉ. ముంమగ ఫైలునందు బదుమూడవ బ్లాకును జూచిపోయెనా
వంమన సుబ్బరావనెడు బ్రహ్మసురుడొక్కడు శూలబాధచే
గ్రిందఁబరుండ వొడియును గ్రీనరుదెంచి గెటప్ గెటప్పటం
చుందమియించె బెత్తమునఁజూపరమాత్రిస్పడ భారతాంబికా.

చ. అదివిని బ్లాకులంగలుగు నందఱు నచ్చట జేరి, యిట్లునీ
వదనము తెఁగొట్టినందుకుత్తమార్పణమీయక యున్న నిట్యోడన్
గదలమటన్న నాతఁడికఁ గార్యము తప్పెనటంచు దక్షుఁడై
యాదిమొదలెంతొ మెత్తవడియాదృతిజూపెను భారతాంబికా.

ఉ. హైళులగోలపోయెఁ దలవాకిటఁ గావలిమాయమాయె, స్నా
నాలకు భోజనాలకు నొనర్పఁబడెన్ సదుపాయముల్ విలా
సాలకు పాఠశాలలకుఁ జాలకయుండెను గాలమల్లిపూర్
జైలొకజైలునాఁజనుని సత్యముచెప్పిన భారతాంబికా.

ఉ. వేళకు స్నానపానములు వేడుకలాటలు వారివారికిం
బోలినవిద్యలున్ సభలపోడిమి పెల్లుగగూర్చు నల్లెపూర్
జైలునుగూడ జైలనుట సాహసకృత్యమిదొక్క విశ్వవి
ద్యాలయమంటకుందగు యదార్థముజెప్పితి భారతాంబికా.

చ. అరవముకన్నడంబుమళయాళమునాంగ్లముదెల్గునంస్కృతం
బురుదునుహిందివాంగమును నుత్కలమాదిగ పెక్కుభాషలం
గఱచినమమ్ము నొక్కెడ సుఖంబుగనుంచుట నేడిదే పర
స్పరమును నేర్చుకోదగిన భాగ్యమునేకురె భారతాంబికా.

ఉ. దైవవశాన నల్లెపురి దండనమందెడువేళ నాకు ని
చ్చావిధిఁ బేర్కొమై నుపనిషత్తులు నాలుగునేర్పినాడు ము
త్తైవికులాబ్ధిచంద్రుడు సుధీజనవర్యుఁడు, కేశవార్యుఁడ
ప్పావనునిం గ్రమాంతవిదుఁ బ్రస్తుతిఁజేసెద భారతాంబికా.

ఉ. కాశికి నాథుఁడీతఁడనఁగాఁదగు తేజమువొల్చు కాశిహ
స్త్రీశుఁడు, కాశినాథుని కుశేభ్యుఁడు, పేరిమినాకునచ్చునం
బోసినయట్లు తానమకముం, జమకంబును జిత్రియు స్వాహా
న్యాయము,నేర్పె నబ్బుధునకంజలి మోడ్చెద భారతాంబికా.

ఉ. పొంగుచు దేశదేశజులు ప్రోగయినారిట, వారలందువే
భంగులెఱుంగు ప్రాజ్ఞులు విపశ్చితులుంటను, విద్యలెన్నియే
నింగరువంగ నైనతఱి నీసుతులందిటు గొందఱేల యీ
బంగరువంటి కాలమును బాడొనరింతురొ భారతాంబికా.

ఉ. నిగ్రహాశక్తిమూతఁగొని నీచతమప్రభులాచరించు న
త్యుగ్రకఠోరకృత్యములకోరిచి బందెలఁ జేరినట్టి స
త్యాగ్రహులందుసైతముదురాగ్రహులుంకుటవింతగాదెటుల్
జాగ్రతగొన్ననైజమగు శౌర్యముమాయునె భారతాంబికా.

ఉ. జైలునకేగినంత తన సాటిమగండిక పృథ్విలోన నే
మూలను లేదులేడనుచు మూర్ఖపుగర్వము నెత్తికెక్కి బల్
కూళతనాన నీసుతులు కొందఱు పెద్దలు పిన్నలంచును
న్మేలునుగీడటంచు గమనింపకయుండిరి భారతాంబికా.

ఉ. మూసినడాగునే జయిలుముచ్చటలింకను విన్మ చేతిలో
బైసగలట్టివాఁడొక నవాబనవచ్చును లేనివారలుం
దోసముగీసమంచనక దొంగతనంబొనరించి యేనటో
శాసనపీసమెటికొని కాలముపుత్తురు భారతాంబికా.

ఉ. జైలునకింక నెవ్వఁడు నిజమ్ముగ రా, నొకవేళ వచ్చినన్
మాలుగుపోతునా, నెలివిమాలిన దేబెవిధాన, పైసకుం
జాలనిగర్భయాచకువిచందమున, న్మడిగట్టినట్టు, లి
న్నాలువుపోలె రాననుచు సారెవచింతురు భారతాంబికా.

ఉ. ఉబ్బినపొట్టఁబట్టుకొని యుస్సురటంచును, జిందులాడుచ
బ్బబ్బయటంచు, లోనఁగలయాతనిరమ్మని వేడుకొంచుఁ ద
బ్బిబ్బయి జైలు పాలకుల బిట్టుగదిట్టుచు సిగ్గుచచ్చి రేల్
ప్రబ్బిన దేహబాధ వెతలంబడుచుంటిమి భారతాంబికా!

ఉ. బారులుతీర్చిముందునిరువంకల నొదళ్ళో సిగ్గు పైటికిన్
జారఁగబెట్టి, ముక్కుచునసహ్యపుశబ్దములంబొనర్చుచో
నోరునుముక్కుమూసుక కనుల్పయికెత్తక దేహబాధలీ
తీరునఁగట్టగట్టుకొని తీర్చుకొనన్వలె భారతాంబికా!

ఉ. చోరులఁ, ద్రాగుబోతులను, జూదరులం, దెరువాటుకారులన్
జారుల, గూటసాక్ష్యములొసంగెడువారల, దుర్విచారులన్
గారలనుంచు బందఖున గంటిమి కాని, మహాత్ములన్ గుణో
దారుల నిట్లు బంధెనిడు దాష్ట్యముగంటిమె భారతాంబికా!

ఉ. జైళులనంగఁ గ్రూరుల, నసత్ప్రవర్తులఁ జక్కదిద్ది స
చ్ఛీలమునేర్ప నేర్పడిన శిక్షణశాలలు, కాని నేఁడో స
చ్ఛీలురఁ, సాధువృత్తుల, విశిష్టుల వృత్తములందెమచ్చఁదేఁ
జాలినలీలనున్నవి నిజంబిది నమ్ముమ భారతాంబికా!

ఉ. జేనెడుగోచిమాత్రమొకచెంప కనంబడఁబెట్టి మోసలన్
మానిసులెందఱున్న నభిమానముమాని కుళాయిక్రిందటన్
స్నానముసేతకున్నదిని జంకునుగొంకు జనింపదమ్మ! మ
మిమ్మానెఱిమార్చనీజయి,లిఁ కేమని చెప్పుదు భారతాంబికా.

ఉ. కొట్టినఁగొట్టమించుకయు గోపముబూనముమమ్ము నెవ్వరేన్
దిట్టిన దిట్టమంచు ఘనదీక్షవహించిన శాంతమూర్తులన్
గొట్టియు దిట్టియుం దలపగూడని చెట్టలొనర్చి బందెలన్
నెట్టననెట్టి రిప్పగిది నీ సుతులన్ విను భారతాంబికా!

ఉ. కూళలు త్రాగి రాజభటకోటులు రక్కసులట్లు పొట్టిలా
టీలనుబూని త్రుళ్లుచుఁ గడిందిగనార్చుచుఁ బిన్నపెద్దలన్
స్త్రీలను వారు వీరనక చేతికినందిన వారి నెల్లఱన్
జాలియు నాలిలేక పెలుచన్బడ మోదిరి భారతాంబికా.

ఉ. కంటివి పెంచితన్న మమకారముతో నినుగొల్చుబిడ్డలన్
దంటతనాన గూడదని తల్లికి దూరముసేయనెంచు బల్
తుంటరిమూక కేవిధియుఁ దోడగుచుంట యుగప్రభావమా
ఛంటకు సందియంబుగలదా తలపోయగ భారతాంబికా!

ఉ. సాధుజనాగ్రగణ్యు డతిశాంతుడనం జను నమ్మహాత్ము స
ద్బోధలఁ దప్పకేము సతతముంబొనరించెడు మాతృదేవతా
రాధనమే దురంత మపరాధమునందు రిదేమి? యెన్నడీ
వ్యాధుల దుర్వ్యధల్ విరుగడై సుఖియింతుమొ భార
[తాంబికా.

ఉ. ముప్పదిమూడుకోట్ల పరిపూర్తికి మాత్రమె బిడ్డలుండి నీ
మువ్వును దీర్ఘజాలని నపుంసకులైరని చెప్పకమ్మ నీ
కొప్పిదమున్ఘటింపగ సముత్సుకులై యురికంబమందు మే
నప్పనసేయు సాహసగుణాఢ్యుల జూడుమ భారతాంబికా!

ఉ. వేలకువేలు నీప్రజలు పెండ్లికిబోవుదు లీల బుణ్య తీ
ర్థాలకునేగు కైవడి ముదంబున గన్గొన నాటకాల్సినీ
మాలకుబోలె జై భరతమాతకుజై యని వచ్చినార లీ
జైళులనింప భక్తివివశత్వము దోపగ భారతాంబికా!

చ. సమయమునాశ్రయించియిటు శాంతమహింసయునేడు మేటినీ
మములుగబూనినార మిదిమాత్రమె యైహిక రాజకీయమా
ర్గములగుగాని యన్యములు కావనుమూర్ఖులమేముకామున
త్తమములురామకృష్ణచరితంబులుచూడమె భారతాంబికా

చ. కలుషములాచరించుఁ, బయిగా, గలసత్యము వెల్లడించు వా
రలమయిఁ క్రోధమున్నణపి తాయిడివెట్టను, దానవారినో
ఖులనొకయింతమూసినను లోకములెల్లనుమాయమాకుడుల్
గలుగవటంచెఱుంగ దధికారవిమత్తుడు భారతాంబికా!

చ. ప్రకుటిలబుద్ధి మమ్మిటు బందెలఁగూరినచో స్వదోష మ
ప్రకటితమానటం చళుకువారుదుమంచుఁ దలంచెగాని తా
నొకటిదలంపదై వముమజ్జొండొనరించుచెఱుంగఁడయ్యొ బా
ధకనయశంబునొందెనుదృఢాత్ములమైతిమి భారతాంబికా!

చ. కలముఁజయిల్ తుపాకులనగాదగు కోరలుమూడుమాత్రమే
కలవు బ్రిటిష్ ప్రభుత్వమను గండరకోలకుఁ దొంటిదానినా
తిలకను దత్తుమున్నయిన ధీరులు రాల్పనికం జయిల్ తుపా
కులపసనూడ్చ నేఁడుకనుగొంటె?మహాత్ముఁడు భారతాంబికా!

ఉ. దేశముఁగాసి చేసి పరదేశజులేలుచునుండ బుం స్త్వముం
బాసినటుల్, సజీవన శవంబులపోలికఁ, గాచి మూసలం
బోసిన దిమ్మలోయన, సపూర్వపుమ్రాకుల కైవడిన్,శిలా
రాసులభంగిఁ, గొందఱవురా! తలపోయరు భారతాంబికా.

ఉ. రంగమునందు నిల్చి బహిరంగపు సేవనొనర్తురు కొందఱ
ర్ధాంగసహాయమిచ్చుచు రహస్యపు సేవనొనర్తురుకొంద, ఱే
సంగతి లేకయుండెద రశక్తులుకొందరు, స్వార్థబుద్ధి నీ
కుం గడుచెట్టగూర్చెదరు కొందరు నీచులు భారతాంబికా!

ఉ. మానముతోడఁ బ్రాణము సమానముకాదనిగుర్తెఱింగియ
జ్ఞానముఁ బాసి బంధములసంగతి గోసి స్వదేశమాతృస
మ్మానముతోడ నెన్నటికి మాయనికీర్తిగడింపయత్నముం
బూననివాని జీవనము బూడిదపాలగు భారతాంబికా !

ఉ. హాటకరత్నరాసులకు నాకరమై పరదేశవాటిను
ట్టూటల నూటఁజేసి విగతోపమవై యలరారునిన్ను నీ
నాటను గూటిగుడ్డల కనాథవిధంబునఁ గుందజేసి యా
రాటమునొందఁజేసెఁ బరరాజ్యవిధానము భారతాంబికా!

చ. పలువిధముల్ మృగంబులును బక్షులు భూమిజముల్ లతావళుల్
గొలకులు వాహినుల్ వనధులున్ గిరులుం దదుపాశ్రితాటవీ
స్థలులును క్షేత్రతీర్థములు సస్యసమన్వితభూమిభాగముల్
గలకలలాడు నీకునిటు కారియగూరెనె? భారతాంబికా!

చ. తరుగని భాగ్యభోగ్యముల ధర్మమునన్ బరతత్త్వబోధమం,
దురుతరసత్కళాప్రతిభ నూర్జిత సాహసధైర్యవిక్రమ
స్ఫురణను సైనికంబునఁ బ్రభుత్వమునన్ జగదేకరాజ్ఞివై
పరగెదు నీవు నేఁడొరుల పాలిన వైతివె భారతాంబికా!

చ. సలిపిరి సత్ప్రజైకరులు సంధికి యత్నములెన్నియేనియున్
ఫలితము లేకపోయెఁ దుది పాలకవర్గము నేయు రౌండుటే
బిలుసభకేగి నెమ్మి వినుపించిరి మమ్మును మిమ్ము నమ్మ దే
శలనను దేశమన్నిటికి కాంగ్రెసె దిక్కని భారతాంబికా!

చ. కడుకొని కద్దరైన నొడిదంబుగ గట్టిన జాలునంచు దా
నెడపక గాంధినేత పదియేడులనుండియు జెప్పుచుండినన్
జెడ చెవిపెట్టినట్టి పెనుభీరులు గూడను నేడు కద్దరున్
దొడుగగడంగినారు పరితోషము కల్గెను భారతాంబికా!

ఉ. కట్టడిఁగట్టి బొంబయిని గల్గిన వర్తకులా విదేశపుం
బట్టల నమ్మరాదనెడి పట్టుదలన్ వహియింప సీమలో
బట్టలమిల్లులన్నియును బాడఱు మూయగవచ్చె నప్పుడిజల్
బిట్టు ప్రభుత్వముం గదిసి పీడయొనర్చిరి భారతాంబికా.

ఉ. దేశజులున్విదేశజులు దేవుడటంచునుగొల్చు గాంధి సం
దేశమునాలకింపమి జనించిన దుష్ఫలితంబునెంచి వై
దేశికపాలకుల్ తుదకు దిక్కఱిసంధికి బూని బందెలన్
వేసినవారలన్విడిచివేసిరి మధ్యనె భారతాంబికా.

ఉ. భారతదేశమందు పరపాలనబాధ తొలంగుగాక వి
స్తారతరైకమత్యమున సర్వజనుల్ సుఖయింత్రుగాక వి
ద్దూరములైనభావములు తుల్లిస్వధర్మమెసంగుగాక చే
కూరుతభూతసంతతులకున్ శుభసంపద భారతాంబికా.

స మా ప్త ము.

నా సోదరుఁడు చి॥ వెంకట జోగయ్యశర్మ జైలునందు
తన యనుభవమునుగూర్చి వ్రాసినపద్యములు.

---

సీ. కరము పవిత్రమౌ ఖద్దరు వస్త్రముల్
విడిచిపెట్టితినయ్య వేధమీర
మట్టలాగును గోచి మరిజుబ్బయును టోపి
ధరియించితినిగదా దైన్యవృత్తి
మురిపెంపు ముంగురుల్ మొదలంట గొరిగించి
పిలకబెట్టితినయ్య పీడదోవ
వెలగలవస్తువుల్ వీడి సీసపుబిళ్ళ
రొమ్మునదాల్చితి రోతపుట్ట
గీ. గోనెచాపొక్కటియు బొచ్చుగొంగడియును
పట్టుపరుపును శాలువై పరగె నాకు
నింక నేమేమిసేయంగ నెంచినావొ
కాచియుంటిని పొందంగ గాంధిదేవ.

సీ. సన్ననిబియ్యంబు చక్కగా వండిన
భోజనంబు మరచిపోయినాను
వంకాయ, చిక్కుడు, పనస గుమ్మిడికాయ
అరటికూరల మాట మరచినాను
వెలగ చింత దోస వివిధములగునట్టి
మామిడిపచ్చళ్లు మరచినాను

ఉప్పు మొదలగునట్టి యున్న యాహారుచుల
మజ్జిగ నేతులన్ మరచినాను

గీ. కల్లు ఉప్పుదుబియ్యపు కూటిముద్ద
దేవతా పులుసొక్కటే దిక్కునాకు
నింక నేమేమి సేయంగ నెంచినావొ
కాచియుంటిని పొందంగ గాంధిదేవ.

సీ. అయిదేండ్లశిక్షల ననుభవించుచున్న
దొంగలు నాపైని దొరలునేడు
ఇరువది ముప్పదియేండ్లు శిక్షలుబడ్డ
హంతకుల్ నామీద నధిపులైరి
పరకాంతలను బల్మి జెరచి శిక్షనుగొన్న
మానహీనులు యజమానులైరి
కడుపుఁ జీల్చినను నక్కరము గాన్పింపని
వార్డరుల్ నామీదఁ బ్రభువులైరి.

గీ. త్రాగుబోతులు జూదరుల్ తస్కరాళి
సాధుహింసకుల్ నా సహచారులైరి
ఇంక నేమేమి సేయంగ నెంచినావొ
కాచియుంటిని పొందంగ గాంధిదేవ.

---

ఓం.

అల్లిపురముకాంపు జైలునందున్నతఱి మిత్రుల ప్రోత్సాహముచే నేనొనర్చిన యష్టావధానపు వివరము.

అవధానారంభ పద్యములు.

---

గీ. శ్రీకరోద్భవశీకర సేకములను
గర్ణతాళజవాత సంగతులచేత
భక్తకోటుల కిల్బిషప్రతతి నణచు
పాలితారంభుహేరంబుఁ బ్రస్తుతింతు !

ఉ. కోరిరిమిత్రులెల్ల నను గొప్పగఁజేసి వధానకార్యముం
దీరుపుమంచు, నీజయిలులోఁడికి సారముజాతెనైన నీ
చారుపదద్వయిన్మదినిసన్నుతిఁజేసి కడంగుచుంటినో
భారతి! వాగ్విభూతినిక్రుపామతినిచ్చి కృతార్థుఁజేయవే !

1వ ప్రశ్న:-ఆనాటి వత్సరమాసతిథివారనక్షత్రములనుజెప్పుచు వధానముజరిగినట్లు కిందపద్యమున వెల్లడింపవలెను.

క. జరిగెఁ బ్రమోదూతన సం
బరము మెయిన్మార్గశీర్షమాసము నందున్
గురువారయుతత్రయోదశి
ధరణి ననూరాధ నీవధానము బళిరా !

2 సమస్య:—

"పికమాదగ్గరలేదుపొమ్మతఁడు సంప్రీతిన్నినుంబ్రోచెడున్"

ఉ. సకియున్నేనునుగూడియుంటిమిటనోచానా మదీయానుజుం
డోకఁడై యుంటను నీకుఁగూర్పఁగలఁడేమో యంచు
[నూహింతు, నిం
చుకయున్ లాభముగూర, దొక్కటెకెమెచ్చుల్ దీర్పఁగా
[జాలునో
పికమా దగ్గరలేదుహెమ్మతఁడు సంప్రీతిన్నినుంబ్రోచెడున్!

3వ ప్రశ్న:-జైలునుండి విడుదలయై యింటనూరక కూరుచున్న వానికి, ఋణమార్పణముగోరి యుద్యమమునుండివిరమించిన వానికిఁ గల తారతమ్యమును మత్తేభమున వర్ణింపుము.

మ అడుగుల్ వైచిరిముందుకిర్వురునుకార్తార్థ్యంబునుంబొందరొ
క్కడుతోడ్తోడనెతూలెనింకొకడు మార్గంబందువిశ్రాంతికై
యుడిగెన్ గాక పరొక్కవేళగరిమన్ సోత్సాహులైధన్యతన్
బడయున్ జాలుదురంచు నెమ్మదిని సంభావించెదన్ సోదరా!

4 వ ప్రశ్న:-ఒకరిచ్చిన కల్పన.

మహాస్రగ్ధర.

సుతుడర్ధాయుష్కుడై తానురిగెనుసురులేచొప్పునన్
[గ్రాలువాడన్
పతికిన్ దూరస్థయైనప్పడతికిగలదే భాగ్యమింతేనివృద్ధిన్
పితరున్ గానైతి కట్టా! వితధుడనైతిన్ చేస్మినా కేలనంచున్
చిత,యాలున్ బిడ్డడేద్వన్ వెతలదొరగనవ్వీరవర్యుండయారే!

5 వ ప్రశ్న-ఒకరిచ్చిన కల్పన.

చ. చెలువనుగూడి సౌఖ్యములజెందెదెకికాలము డాయవచ్చనే
దలచితిదేశమున్ గొలువ, దప్పదుదానవుకై లు, మధ్యలో
దొలగితినేని దెల్లరును దూసుదురీయెడ నేమిసేతునం
దెలివి జనింపకుండెనిట దేనిని బూనుదు దేని మానుదున్.

6 వ ప్రశ్న-గాంధిః, జేతుం, ఈశః, పాయాత్, అను నాసి
న్నునందలి వర్ణములలో నొకటి మొదట నొకటి తుదిని
యుండునట్లుశీర్వాదమునను ష్టుప్ శ్లోకమున జెప్పవలెను.

శ్లో॥ గాంధి ర్మహారాజసాంకంధిః
జేతాయేన యదార్జితుం
ఈ హాంగతోద్య సర్వేశః
పాయాత్ప్రియాన్నః ప్రియాత్.

7 వ ప్రశ్న-సమస్య.

"కరణంబునుజూచి భూమికాంతుడు బెదరెన్".

కం. పరిపూర్ణ బాహు సత్వులు
హరిపుత్రకు లొకరికొక్కరందక పెలుచన్
గిరులంబోరంగ, వసా
కరణంబునుజూచి భూమికాంతుడు బెదరెన్.

హరిపుత్రకులు = వాలిసుగ్రీవులు.

౩ వ ప్రశ్న-స్వరాజ్యము వచ్చినచో నీకారాగార భవనములు దేశీయ పరిశ్రమల కుపయోగింపవలెనని కోరిక.

శా. బారున్ విస్తృతిగల్గి యున్నతములై బాగొప్పనీయుల్లెపూర్ కారాగారపు మందిరంబు లిక నెక్కాలంబునన్ గార్మికా గార ప్రక్రియనుమారి జాతికుపయోగంబౌనొకోయంచు నిం పారంగోరెదు మాదుకోర్కె సఫలంబౌనెన్నడో శంకరా!

## అవధానావసానమున నితరులుచదివిన పద్యములు.

చె రు కూ రి కా శ వ స్తి శ్వ ర శ ర్మ గా రు.

సీ. సరససాహిత్యకవితా ప్రసారములయ
దృష్టిగా నవధానముదీర్ప గలిగి
నట్టి భవదీయమేధామహాత్వమునకు
ధన్యవాదముల్ మల్లావధానివర్య !

పా తు రి మ ధు సూ ద న రా వు గా రు .

ఉ. జై లునతిండిసారమిటుజారెనటంచునుబల్కు టెల్లవా
గ్లీలయెగాని నిక్కవమొకింతయుగాదు భవద్విశేషమీ
లీలవధానమందె యరలేకగ్రహించితి మిమ్ముబోలుధీ
శాలురజాడమొయ్యెడను సార్థకమల్లవధానిసత్తమా !

శా. ఏ రీతుల నెవ్వరెద్ది యిమ్ము బఠ్నింపించినన్ వారిక
ట్లారయారీతులను త్తరంబులిడియాత్మానందముంగూర్చు త్వ
ద్వ్యాయామంబునకీడుగా దగిన రత్నగ్రామమూలేదు, నే
నీయంబూనినపద్యముల్ గొను వధానీ మల్లభూమీశురా!

బా ల క వి- ద ం టు వీ ర రా ఘ వ య్య గా రు.

క. అవధానినామధేయం
బవధానము జేసి మీరలయ్యా! యిచటన్
భువి నిల్పజాలినారలు
కవిలోకము మిమ్ముఁ బొగడఁగా సభలోనన్!

గీ. ఇచట నష్టావధానంబు నింపుగదుర
జరిపి పద్యాలు చక్కఁగాఁ జదివినారు
మాకు సంతసమయ్యెనో మాన్యచరిత
గరికపాటివంశంబిక మెరుగుగాంచు.

సీ. ఒకప్రక్క చతురంగ మొకప్రక్క పాఠంబు
నొకటవ్యస్తాక్షరి సుకవులడుగ
నొకటసమస్యయు నొకటదత్తాక్షరి
యొకటజిల్లరిమాట లకటయడుగ
నొకచోఁ బురాణంబు నొకట మహాస్రగ్ధ
రొకచోటవర్ణనల్ సకలమడుగ

శాంతంబుగామీరు సాంతంబుబోవరించి
రష్టావధానంబు కష్టమనక

గీ. మీరలందఱు గంటిరి వీరిశక్తి
నేను బొగడంగనేరను నిక్కువముగ
నరసుమల్లావధాని భూసురుని సతము
మల్లికార్జునుఁడేలుత మమతతోడ.

గీ. కైకచేతను రాముని కథ వెలింగె
గాధిసుతుచే హరిశ్చంద్రు కాంతినిలిచె.
నల్లమల్లావధానిగారందె గీర్తి
కంటిప్రశ్నలు నేవేయుచుంటఁ జేసి.